





# విజ్ఞానము

ఆధునిక,భౌతిక,జీవ,గృహ,వృక్ష

# సహదేవ పశువైద్యము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 9000000001601

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ధన్వంతరి నేనమః




ప్రకాశకులు:

**కొండా శంకరయ్య**
**బుక్ సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్**
**శికంద్రాబాద్ (దక్కన్)**

బ్రాంచి:— మెయిన్ రోడ్, వరంగల్

—)o(—

1951



వెల 0—8—0

# పీఠిక

మహానుభావు లేగ్రంథము రచియించినను దేశ సౌభాగ్యము కొఱకేయని గుర్తెరుంగుట మనవిధి. ఈ పశువైద్య శాస్త్రము మనవర పరాత్పరుండని ప్రఖ్యాతి గడించిన సహదేవునిచే రచియింపఁబడినట్లు గను ఆ గ్రంథముయొక్క ప్రాశస్త్యము నెఱిగి పూర్వకవులలో నొక రగు నారనయను కవిపుంగవుం డాంధ్రీకరణం బొనర్చినట్లుగను యీ గ్రంథము దెల్పుచున్నది. ఈతని కాల నిర్ణయమును జేయుటకుఁగాని, కులగోత్రాదుల నెఱుంగుటకుఁగాని తగిన యాధారములు మాకెందును లభ్యము కాలేదు లభ్యపడినచో నీతూరి ముద్రణమునందు విపులముగా వ్రాసెదము. పూర్వ సాంప్రదాయానుసారముగ నీగ్రంథము రచియింపఁ బడి లోకోపకారమై యొప్పారుచున్నను గవిత్వమును గూర్చి విమర్శింప వలె నన్నచో జాల గ్రంథము కాఁగలదు. ఇందలి పద్యములు వారి వీరి నోటనుండి యీదుస్థితికి వచ్చినవా లేక గ్రంథ కర్తయొక్క రచనమే యింతయా యనెడి యనుమానమును ముందుముందు రాహిత్య మొనర్చుకొన్నఁ గాని యిద మిద్ధమని నిర్ధారణ సేయుటకు వలను గాదు. అందుచేఁ బ్రకృత మావిషయమును నిలిపి వేసితిమి.

కాని తప్పులో యొప్పులో యేమైనఁగాని యేదో యొకరీతిని యిట్టి యథార్థమును గలుగ జేయుటలో నప్పటి కాల పరిస్థితుల ననుస రించి పరోపకార చింతనముచేతనే యీ గ్రంథకర్త యిట్టి మహో త్కృష్ట కార్యమునకుఁ బూనుకొనెనని యూహించి యెల్లఱము వాని యెడ శాశ్వత కృతజ్ఞులము కాక తప్పదు.

ఇం దుదహరింప బడిన ప్రక్రియల నెల్లఱును బాగుగా నాచర ణము లోనికిఁ దెచ్చుకొని పశువుల క్షేమముల నారయుదురుగాక యని మాత్రము ప్రార్థింతుము. మిగత విషయములఁ జదువరుల కేవదలెదము.

ఇట్లు,
ప్రచురణ కర్తలు.

# విషయసూచిక

శ్రీ రామ.



# పశువుల వైద్యశాస్త్రము

## 1 సహదేవ ప్రణీతము.

కం॥ శ్రీయును గీర్తియు నధికో
పాయంబునఁ గలుగుపుణ్య । పరులకు దీపం
జేయంగఁబడెడు సత్కృతిఁ
బాయకఁ జదివినను వ్రాయఁ । బారము గొన్నన్ ॥ 1

తా॥ ఈ గొప్ప గ్రంథము జదివినను రచియించిన బాఠ మొన ర్చినను, యిందుఁ జెప్పబడిన ప్రక్రియల నాచరణములో నుంచి వరోప కారమునకై పాటు పడినను అట్టివారి కఖిలైశ్వర్యములునుఁ గీర్తియుఁ జేకూఱుఁ గలవని గ్రంథకర్తయొక్క ఆశీర్వాదము.

ఉ॥ దేవసమానుఁడైన సహ । దేవుఁడు గోవులకున్ హితంబుగాఁ
భావనమైన వైద్యము శు । భస్థితిఁ జెప్పెనుగా నికన్ మహా
దేవ వరప్రసాదమునఁ । దెన్గునఁజెప్పఁ దొడంగితిన్ వడిన్
గావున సత్కవీంద్రుఁడ న । ఖండ చరిత్రుఁడ నారయార్యుఁడన్ ॥ 2

తా॥ గోసంరక్షణార్థమై దేవతాతుల్యుఁడైన సహదేవుఁడు వైద్యశాస్త్రము రచియించెను ఈశ్వర కటాక్ష లబ్ధుఁడనై నారయా యనుపేరఁ బఱఁగెడి నే నారచనమును దెనిఁగించు చున్నానని గ్రంథ కర్త నుడువుచున్నాఁడు.

కం॥ దేవతలు మర్త్యమున మను
జావళిఁ బుట్టించివారి । కమృతముఁ గురియం
గావేడి సురభి కమరులు
గోవులఁ బుట్టించి రిలకు । గోధనమునకున్ ॥ 3

తా॥ భూలోకమున జరయు మృతియుఁ గల నరుల సృష్టించి వారి జీవనార్థమై యమృత తుల్యమగు క్షీరంబులభియించఁజేయు గోవుల సృజియించినాఁడని భావము.

కం॥ భావించి వానికిష్టము
గావింపఁగఁ బుణ్యమగును । కలియుగమందున్
గావున వైద్యము క్రియతో
జీవధనంబునకు నెఱిఁగి । చేయుడు మనుజుల్ ॥ ౪

తా॥ గోవుల కిష్టమగునట్లుగను, మీ జీవితములకక్కఱకు వచ్చు నట్లుగను నీ వైద్యము నాచరణము నం దుంపుఁడని గ్రంథకర్త హెచ్చరించుచున్నాఁడు.

కం॥ రోగము గోవుల కొదవిన
వేగంబుగ మందులెఱిఁగి । వివరము తోడన్
బాగుగ బెట్టుఁడు వానికి
వేగమె రోగములుమాని । వృద్ధింబొందున్ ॥ ౫

తా॥ గోవులకు రోగము వచ్చిన వెంటనే తదనుకూలమగు సాధములఁ దెలిసికొని యుపయోగించుచో గోవులారోగ్య స్థితిం బొందగలవు.

## 2 దొమ్మ లక్షణము.

కం॥ దొమ్మయిన రోగణంబులు
నెమ్మది కడుపుబ్బు పరకు । నీరును బారున్
గ్రిమ్మర నూరవు తెగయును
సమ్మదమున నేలకొక్క । ఝామున వాలున్ ॥ ౬

తా॥ దొమ్మయనెడి రోగము వచ్చిన పశువునకు కడుపుబ్బును శరీరము వడంకుచుండును పగర్పు మిక్కుటముగా నుండును. ఒకఝాము కంటె నెక్కువ జీవింపఁజాలదు.

కం॥ మేతుడగు, నీరుముట్టదు
చేతి యుడుగు ముక్కు దడియు । చెమటయుఁ గలుగున్
రీతిఁజూడి నల్లఁబడు నాడ
లి తెలుఁగున నుండుదొమ్మ । లెఱుఁగుడు పశులన్ ॥ ౭

తా॥ మేత ముట్టకుండుటయు, నెమరు వేయకుండుటయు, ముక్కు-
వెంట నీరుగార్చుటయు, నొడలంతయుఁ జెమట గ్రమ్ముటయు, నల్లఁ
బాఱుటయు, నివి దొమ్మ లక్షణమని చెప్పఁబడినవి.

కం॥ మునుదీనికిఁ ద్రిఫల, త్రికటుక
మనుపానము చింతపులుసు । నమరిచి యుండే
విను మెనుము శౌచరసమును
ననువుగ నిచ్చినను దొమ్మ । లప్పుడె మానున్ ॥ ౮

తా॥ తాడి; వుసిరి, కరక్కాయలను త్రిఫలముల గుండయున్ను
శొంఠి, పిప్పలి, మిరయాలనెడి త్రికటుకముల గుండయున్ను అనుపాన-
ముగ చేసి చింతపులుసుతోఁ గలిపి గేద పేడరసముఁబోసి త్రాగించి
నచో దొమ్మరోగము తక్షణమే కుదురును.

కం॥ భల్లూకపు రక్తముతోఁ
గల్లుప్పును, శొంఠి పొడుము । గరిధూపంబున్
నల్లని మేఁకల మూత్రము
తెల్లముగను బట్టదొమ్మ । తెగులును మానున్ ॥ ౯

తా॥ ఎలుఁగుగొడ్డు నెత్తురు సముద్రపుటుప్పు, శొంఠిపొడుము,
నల్లమేఁక మూత్రముతోఁ గలిపి త్రాగించిన దొమ్మలు హరింపగలవు.

గీ॥ నీరుద్రావకుండ । నీడను శయనించి
కాకనీరుద్రావఁ । గరుణఁబోసి
కొఱ్ఱగంజికాచి । కొమరొప్పఁ బట్టిన
వేరెవవలదు దొమ్మ । విడిచిపోవు ॥ ౧౦

తా॥ ఇతర విధములైన యేనీటినిఁ ద్రావనీకుండ బశువులను
నీడను బరుండఁజేసి వేనీళ్ళను మాత్రమే త్రాగించుచుఁ గొఱ్ఱగంజి
కాచిపోసిన దొమ్మరోగము గూర్చిన భయ మక్కరలేదు.

కం॥ బఱియెముక సందుదావల
నురమున వాలమునకిందం । నొగి ముక్కవయున్
నిరవును దప్పకఁ గాల్చిన
నరయంగా దొమ్మపోయి । యప్పుడె కుదురున్ ॥ ౧౧

తా॥ వెన్నెముక కెడమసందునను, యుదరము మీఁదటను,

తోక కడుగు భాగంబునను, ముక్కుపైనను గడు జాగ్రతగా రతులు వేసినచో దొమ్మ పరిహరించును.

4 చల్ది దొమ్మ.

కం॥ మానెడు సోలెడు గిద్దెడు
భానకమును నావుపంచి । తంబును గూడన్
మానుగఁ ద్రావించినచో
ధేనువులకు శీతదొమ్మ । తీవ్రిమడంగున్ ॥ ౧౨

తా॥ శీత దొమ్మలకు మొదటిసారి మానెడు, రెండవతూరి సోలెడును, మూఁడవతూరి గిద్దెడును, నితరగకవు గోవుల పంచితమును త్రాగించినచో జక్కని గుణ మిచ్చును.

5 పాలదొమ్మకు చికిత్స.

గీ॥ పాలుగుడిచి మొదలు । వాడియు దస్సియు
నున్న క్రేవులకును । నొప్పుగాను,
గలిజెరాకు పసరుఁ । గలియఁ జెన్నెరుదుంపఁ
బెట్టఁజుల్కుడగును । జెట్టవెల్ల ॥ ౧౩

తా॥ దూడల విషయములో పాలు త్రావియు దస్సియు కృశించియు దొమ్మలక్షణములు కన్పించునేని తెల్లగలిజెరాకు పసరుతోఁ జెన్నెరు దుంపనూరి, తినిపించుచో రోగము కుదురును.

6 పాఱుటకుఁ చికిత్స.

గీ॥ చలిది మేసినలేగ । చెడబాఱి చిక్కిన
నూనెముంచి యేకు । నోటికిడుట
గాగజల్లతోడ । కనకంపు పత్తాకు
కలియ నూరిపెట్ట । నిలిచిపోవు ॥ ౧౪

తా॥ పసిరిక వేయుటచే చిన్నదూడలకు పాఱుట సంభవించును. అట్టివేళ మంచినూనెలో దూదియేకును ముంచి తినిపించి మజ్జిగతోఁ బసిడి ప్రత్తియాకును నూరిపెట్టిన పాఱుట ఆగును.

7 అజీర్ణ చికిత్స

గీ॥ పాలు మిగుల గుడిచి । పాలరగక నున్నఁ
గ్రేవులకును బెట్టి । మేపుతోడఁ

బెరుగు గంజియాకుఁ । బె న్నెరు దుంపయు
నరకఁ బెన్నుఁగు మాను । నాతుణంబ ॥ ౧౫

తా॥ దూడలు మితిలేకుండ పాలుఁద్రావి యవి యరుగకున్న స్థితిలో పచ్చి గంజాయాకుఁ బె... లయనూరి అందులోఁ బె న్నెరు దుంపఁగూడ గలిపి బాగుగా నూరించి తినిపించుచోఁ జక్కఁపడును.

8 విరేచనములకు

కం॥ పలుమరు బారెడు లేగకు
సలలితముగఁ ద్రికటుకంబు । జల్లను బెట్టన్
డలగకఁ బారుట మానును
నిలలోపల నిట్టి వైద్య । మేర్పడి యుండెన్ ॥ ౧౬

తా॥ విస్తారము బాఱెడి లేగకు, శొంఠి, పిప్పలి, మిరియాలు, వీని చూర్ణమును జల్లతోఁ గలిపి పెట్టిన నయమగునని లోకప్రసిద్ధి.

9 పాలకొలకు చికిత్స.

గీ॥ పాలకొలకు ... । బలుమారుఁ బాఱిన
బరుల బడగాక । బరగ నినుడు
వెన్న తోడ బసుపు । వెల్లకొట్టులు పెట్ట
దెవులుమాని వేగ । దెలివిఁ బొందు ॥ ౧౭

తా॥ పాలకుఁ బాలు పాఱెడి లేగలకు బతికొయెముక వైవులపండ్ల యొద్ద రతు వేసి, పసుపును, తెల్లకొట్టులను వెన్నలోఁ గలిపి తినిపించిన నీరోగము హరించును.

ఆ॥ పాలు మిగుల గుడిచి । పాఱి చిక్కిన లేగ
పెరుగు గంజయాకు । బిసికి బెట్టు
మేడునాళ్లు దంగ । డిగురుఁ బెరుగు పెట్ట
పారుటెల్ల మాని । బ్రతుకు క్రిప్పు ॥ ౧౮

తా॥ మితిలేని పాలుఁద్రావి జీర్ణముగాక బాధపడెడి లేగలకుఁ బెరుగులో గంజాయాకుఁ బిసికి పెట్టినను లేక తంగేడాకు చిగుళ్ళు మేడు పూటలు పుడికించి పెట్టినను బాగుపడును.

10 నెరిడలు.

కం॥ నెరిడలు పుట్టిన పసరము
నెఱ వెఱిగినను మేతలుడిగి । నీరుద్రాలంగన్

బరవున నిట్లొక మానము
నరయఁగ లేకున్న నురము । వర్ధిలు పెరుగున్ ॥ ౧౯

తా॥ మేత మానుటయు, నీరు త్రాగకుండుటయు, నెరిడలు తగిలిన పశువులయొక్క లక్షణము, ఇట్టిరోగమున కుపేక్ష చేసిన యెడలఁ గడుపు పెద్దదయి విపరీత రోగములకు గారణ మగును.

11 చికిత్స

సీ॥ సమము గొర్రపిండి । సరికరి ధూపము
నూనె గలిపి ముక్కు । లోన విడిచి
వెదురు టాకు పసరు । బెట్టిన గొట్టెడు
దిన దినంబు నెరిడి । తిరిగిపోవు ॥ ౨౦

తా॥ ఇట్టి రోగమునకు గొర్రలపిండి, కరిధూపము సమానముగా నూనెలో వైచి ముక్కు రంధ్రములలో బోయవలెను. ఇదిగాక వెదురు టాకు పసరు గొట్టెడు లోనికిచ్చిన నెరిడరోగము నశించును.

12 మరియొకటి

కం॥ కలితో మోదుగ పూవును
గలియుంగా నూరిపెట్టు । కరిధూపమునన్
నరవడ సున్నము వేసే
వెలయఁగ బెట్టినను దాడ । వేగమె మానున్ ॥ ౨౧

తా॥ బియ్యపు కడుగుతో మోదుగ పువ్వులను బాగుగా నూరి అందులో కరిదూపమును, కొంచము సున్నమును కలిపి తినిపించినను నెరిడ రోగము కుదురును.

13 ఇంకొకటి

కం॥ దిరిసెన చెక్క రసంబును
నరయుంగా నావుపాలు । నందున గలపన్
కలితో నిరువుగ మూనెడు
దిరముగ నిడియున్న నేడు । దినములు మానున్ ॥ ౨౨

తా॥ దిరిసెన చెక్క రసమును ఆవుపాలును, కడుగును బాగుగా కలిపి దినము 1 కి మానెడు చొప్పున ద్రావించిన నేడు దినములలో నీరోగము కుదురును.

## 14 దీనికి రక్ష

గీ॥ దాపలి బదిమొదలు । దబ్బన మునుగాల్చి
నాల్గు వేళ్ళనాట । నయముతోడ
నూనె గాచిపోయు । నొప్పిశమించును
అష్టరేఖలగుచు । నగుపడంగ ॥ ౨౩

తా॥ దాపలి వైపున నాలుగు వ్రేళ్ళ వెడల్పున నష్టరేఖలవోలె దబ్బనము సహాయముతో, వేడినూనెతో రక్ష వేసినను యీరోగము హరించును.

## 15 నిధానము తెలియని చికిత్స

సీ॥ ఏరోగమైనను । నేర్పరింపంగ రాక
నీరు మేపులుడిగి । నిలిచియున్నఁ
గలితోడుతను శింశు । క్రమప్రమాణంబులు
మర్దించి యరిశాలు । మడిమఁ గలిపి
మూఁడు దినములిడ్డ । మునుకొని రోగంబు
లేవైన మనుజుల । కెఱుకపడును
ఎలుగునెత్తురు కలిని । నేరోగమైనను
కలిపి పెట్టినమాను । గడముతోడ,
ఆ॥ దానరోగగతులు । గానకయున్నను
నిట్టి రెంటిలోన । నేదిదొరుకు
నదియె కూర్చిపెట్ట । నతిశీఘ్రముగ మాను
రోగములు దొలంగ । రూపువచ్చు ॥ ౨౪

తా॥ నీరుఁ ద్రావకయు, మేతతినకను, నిలిచిపోయిన పశువుల లక్షణములను గ్రహింపలేని స్థితిలో కడుగునందు మోదుగుపువ్వు బాగుగా మర్దించి కలిపి, అవువంచితము గూడ కొంతచేర్చి యిచ్చినను, లేక కలిలో నెలుగుబంటి నెత్తురును కలిపియిచ్చినను, మూఁడు దినములలో వసరము మంచిదశకు రాఁగలదు.

## 16 నల్లమునుగు

కం॥ నల్లఁబడి మేపు లుడిగినఁ
దల్లంబుగ దెలివిలేక । దీనతనున్న ॥

గల్లును మోదుగ పూవును
కల్లపడక బెట్టరోగ । గతులంగ్ మానుర్ ॥ ౧౫

తా॥ నల్లబడి తెల్లబడితే హీనపడి యున్న నున్నట్టియు, మేత దిన కుండ నున్నట్టియు, పశువులకు కల్లువంటి మోదుగపూవును నూరి తిని పించిన రోగములు పోవును.

## 17 వేఢాక చికిత్స

కం॥ దిరిసెన చెక్క రసంబును
పరమాత్రియు మూసిచేసి । నవదివసంబుల్
బరిపాటిఁ బెట్టి రేనియు
మఱిపుట్టదు నల్ల తెగులు । మానుగ బశులక్ ॥ ౧౬

తా॥ మనుజుని మూత్రమందు దిరిసెన చెక్క రసమును కలిపి తొమ్మిది దినములు వరుసగా దినము 1 కి మూసెడు త్రాగించిన నల్ల తెగులు పూర్తిగా హరించును.

## 18 మఱియొక చికిత్స

గీ॥ వెదురు, నేలవేము । వెలయంగ నల్లేరు
నడ్డసరము పెద్ద యూవపిండి
గుముడు పండ్లగూర్చి । కోర్కెతోఁ గలితోడ
నలరఁ బెట్టమాను । నల్ల తెవులు ॥ ౧౭

తా॥ వెదురు, నేలవేము, నల్లేరు, అడ్డసరము, పెద్ద ఆవాలపిండి, గుమ్మడుపండ్లు, వీనిని కలికో నూరి తినిపించినను నల్ల తెవులు మానును.

## 19 నరగడ చికిత్స

కం॥ కల్లుప్పు, నానపిండియు,
వెల్లుల్లి బదేను తిథులు । విడుపక బెట్టన్
జల్లను దినమును గొట్టెడు
తెల్లముగా నరగడంబు । తీరును బశులక్ ॥ ౧౮

తా॥ కల్లుప్పు, ఆవపిండి, వెల్లుల్లి, యీ మూటిని మజ్జిగలో గలిపి గొట్టము సహాయమున 15 దినములు పెట్టిన నరగడ రోగము పోగలదు.

## 20 మలిమిడి చికిత్స

కం॥ మలిమిడికి జిత్రిమూలము,
పెటుచక్ ఆముదము గల్పి । పెట్టుదు రిట్లుగ్,

మలిమిడి ద్రికటుకముతో
బొలువుగ వ్రాయుంగ ద్రాత । పుండును మానున్ ॥ ౨౯

తా॥ చిత్రమూలము ఆనుగముతో గలిపి తినిపించడమే కాక పుండుమీద శొంఠి, పిప్పలి, మిరియాలు నూరి వుడికించి రాచిన మలిమిడిరోగము పోవును.

21 మరియొక చికిత్స

కం॥ మలిమిడికి గెంటెనేనియు
జెలిమిడి దుష్టపుల వేళ్ళు । చెండియు నీరుం
గలివెచ్చ జేసి పెట్టిన
బొలువుగ్గ నాతంటెదీసి । పోవుంబసికిన్ ॥ ౩౦

తా॥ ఈవ్యాధిచే గాళ్లు పుండ్లుపడి కుంటునప్పుడు దుష్టపాకు వ్రేళ్ళరసము వెచ్చజేసి కడుగుతో పెట్టిన కుంటుతనము మానును.

22 అర్రిపట్లులకు రతులువేయు స్థానములు.

కం॥ ముక్కుకొన, తోక తుదయును,
నక్కజముగ దార్రిడుగొల్చి । యదిసగము గొల్చి
టక్కున చూచిన యెద్దుకు
నక్కజముగలట్టు పట్టు । నప్పుడె మానునున్ ॥ ౩౧

తా॥ పశువులయొక్క ముక్కుకొన మొదలు తోకచివర కెంత పొడవుండునో అంతతాడ్రిడు గొల్చి అందు సగము దూరము ముక్కు దగ్గరనుండి రతు వేసినచో అరుర్రిపట్టు మానును.

13 రొమ్ము పట్టుటకు చికిత్స

గీ॥ రొమ్ము పట్టి పసికి । రుజహెాల్ప దల తెని
గోరి తెలిక పిండి । కొట్టెజేసి
పాలు కలిపి పెట్టి । పండ్రెండు దినములు
వేపు బెట్టనద్దు । రూపువచ్చు ॥ ౩౨

తా॥ రొంపవలన బాధపడు పశువునకు తెలకపిండిని పాలతో కలిపి గొట్టముతో పెట్టినచో 12 దినములలో తగ్గును.

24 బొడ్డెటికె లక్షణము

కం॥ తొడుర్రిపడు లేచు బలుమలు
నిట్టిలపడి చూచికాళ్ళు । సీల్లుమనుండున్

మెట్టదు బొయ్యేదు బొడ్డెటిసి
పుట్టిన పసరము చికిత్స । బొందురుగంగ ॥ ౩౩

తా॥ బొద్దెరిక గల్గిన పశులక్షణము:— తరచుగా నులికిపడును. వెలవెలబారిన ముఖముతో జూచును. కాళ్లు నిగడదన్నును. కదలదు. మేతదినదు.

25 ఇాదుకుఁ జికిత్స

కం॥ ఈరోగమెత్తినప్పుడు
నారంగరిధూప, త్రికటుక । నాయనుములుమా
బీరాకు పసరు, నెయ్యిని
భూరమణా! పోయు నట్టి । బొడ్డెరుమానుక్ ॥ 3౪

తా॥ పైరోగము సంప్రాప్తమైనప్పుడు, కరిధూపము, త్రికటుక ములు, అనుములు, బీరాకుపసరు, నెయ్యి వీనిని గలిపి త్రాగించిన మారించును.

26 కడుపు నొప్పి

గీ॥ కడుపు కుట్టినేల । బడుచు లేచుచునున్న
బసరమునకు నెరిగి । ముసల మొకటి
మూడునాల్గుమార్లు । మున్ను జఠరమ్మున
వేయఁగడుపు కుట్టు । వేగమాను ॥ 3౫

తా॥ కడుపు కుట్టు బాధచేఁ బాళ్ఁజాలక నల్లాడు పశువును రోకలి మూడునాలుగు పర్యాయములు పొట్టపై గుమ్మి పొర్లించిన గుట్టు సర్దుకొనును.

కడుపు వుబ్బునకు జికిత్స

గీ॥ వెన్ను మేయుగడ్డు । యెంతగా నుబ్బినఁ
బసికిఁబొతదంటు । మసిజలంబుఁ
బెట్టినదియకండ్ల । బెట్టియుండిన వేగ
నొక్క గడియలోన । నుబ్బుమాను ॥ 3౬

తా॥ కొత్తచేనులో వెన్ను విరిచిన కాలముల నావెన్నులఁ దినెడి పశువులకుఁ గడుపు వుబ్బును అట్టి సమయమందాపైరుల పాత దంటు నే కాల్చి దాని మసితో నీరు త్రాగించిన నుబ్బు హరించును.

28 ఇందులకు మఱియొక చికిత్స

కం॥ కడు భారముగాఁగ నుబ్బిన
పెడసందెల రెట్టగలపి పెట్టుట నీటఁ
జొడిబడిక మూఁడుగొట్టెలు
కడువేగమె పెట్టినంతఁ గదలక పోరున్ ॥ 3౭

తా॥ భరింప శక్యముగానంతగా కడుపుబ్బినపుడు పెద్దకొంగల రెట్టను నీటిలోఁ గలిపి మూఁడు గొట్టములు తాగించిన సుఖముగా విరేచనమై కడుపుబ్బు తగ్గగలదు.

29 ఇరువాయి గట్టినందులకు జికిత్స

కం॥ ఇరువాయి కట్టి యూరుపు
విరియక నిగ్రహముఁబొంద వేగమ పసికిన్
గురివెంద పసరుఁ గలితో
వెలుపునఁ బెట్టంగఁ గదుపు వేగమె పాఱున్ ॥ 3౮

తా॥ వాతరోగము వలన నూపిరి తిరుగక గిలగిల దన్నుకొను పశువునకు గురువిందాకుపసరు కడుగుతో గలిపిపెట్టిన విరేచనమై వాతము హరించును.

30 దీనికి విఱుగుడు

కం॥ మిగులం బెట్టిన పేగులు
దెగఁబాఱంగాను బసికిఁ దెలివిని గొట్టం
బగమిడుఁడు చల్ల తంగెడు
చిగురును గలి నూరిపెట్ట చెచ్చెరమానున్ ॥ 3౯

తా॥ పైన చెప్పంబడిన ప్రక్రియ వలన విరేచనము లెక్కుడుగా నైనచో జల్ల తంగేడు చిగుళ్ళు మెత్తగా నూరి కడుగుతో కలిపి బెట్టిన విరేచనములు కట్టును.

31 వాతరోగము చికిత్స

కం॥ దుష్టపు పసరొక మీనెడు
నిష్టము గలిఁ బులియపెట్టి నేరుపుతో వి
స్పష్టము సోలెడు మరగగ
గష్టపు పసరముకుఁ బెట్ట గడువృద్ధియగున్ ॥ ౪౦

తా॥ దుష్టుపోతు పసరమును ఆ నెదు కలిలోఁ బులియపెట్టి దానిని సోలెదుగా మరగనిచ్చి త్రాగింప వలయును.

31 రొమ్ము దగ్గుకు చికిత్స

గీ॥ రొమ్ము దగ్గువపసికి । రుజ జూన్న దలతేని
తెలక పిండి పోల । గలిపిపెట్టి
పత్తికాయ ఆవు । పాలతో గడుకుమిక్కి
పెట్టబడిన బసికి । బెట్టిమేవు ॥ 41

తా॥ తెలకపిండి పాలలో గలిపి తినిపించి పత్తికాయలు ఆవు పాలతో కుమిక్కి దానిని మేపి మంచిమేత పెట్టవలెను.

33 ఇంకొక పద్ధతి

కం॥ దిరిసెన చెక్క రసంబును
మిరియంబులు గలయనూరి । మేదినిలోనన్
సురభులకు నాల్గుపూటలు
విరసవు చెవిలోన నిడగ । వేగమె మాను న్ ॥ 42

తా॥ దిరిసెనచెక్క రసంబులో మిరియపు గింజలనునూరి నాలుగు పూటలు పెట్టిన రొమ్ముదగ్గు హరించును.

34 ఇంకొక తరహావాతము

సీ॥ ఒనరనాలుగు కాళ్ళు । న్యూనంబుగా వాచి
కదల నేరక జర । కాలమైన
దానికి వావిలి । తంగేడు, దిరిసెన
బాడిద వేపాకు । పసరు తెలమి
మానెడామదమును । మరినెయ్యి నూనెయు
నందులోపల గలి । యంగబోసి
కడుమెల్ల సన్నియు । గాచిపొంగారంగ
బ్రేమలో పద్వేడు । పెట్టవలయు

గీ॥ వాతమెట్టిదైన । వారక బదునాల్గు
దివసము లిడినదొంటి । రొమముకంటె
లావు గలిగి బ్రతుకు । గోవుకీ క్రియజేసి
రేని వాయువులను । మానుచుండు ॥ 43

తా॥ నాలుగుకాళ్ళు వాచి కదలజాలని పశువునకు వావిలి లంగేడు దిరిసెన, బాడిద, వేపాకు రసము మానెడు వంతున గలిపి మానెడాముదము, నూనె, నేయి వీనియందు మిళితము జేసి కాచి పసరులింకునటుల గావించి రోజు 1 కి తవ్వెడు చొప్పున 14 దినములు పెట్టినచో నెట్టి వాతము నైనను హరించును.

35 జంబుక వాత లక్షణము

ఉ॥ జంబుక వాతమైన పశు । జాతికి దీర్ఘ యుతంబు లైన రో
మంబులు బుట్టి దానొడల । మారుత మెప్పుడు మార్పుబొందున
గ్నింబడ మేయనోడమఱి । నీడల దూవగ వచ్చునట్టి రో
గంబు జనించెనేని బసి । కాళ్ళను బారక జాచు నోర్వకన్ ॥

తా॥ జంబుకవాతమనెడి రోగము ప్రాప్తమైనపశువునకు వెంట్రుకలు బాగుగా పెరుగును. మాటిమాటికి బెదురుకాళ్ళు యొక్కట్టుకొనిపోయి మేతమాని యెండకు తాళజాలక సదా నీడనే కోరుచుండును.

36 ఇందులకుఁ జికిత్స

చ॥ బిసరుహ మూలమున్ బసపు । బెండల వేళ్ళను నొక్కరూపుగా
వసుమతి శర్కరంబునను । వారకఁ గ్రుమ్మచుఁ బందినేతితో
మసలక వండి లేహ్యము క్రి । మంబున గోత్రైల పాలతోడుతన్
బసరపు పక్కవాతముకు । పథ్యము పెట్టిన మాన్పుఁజెందెడిన్॥ రసి

తా॥ తామరదుంప, పసుపు, బెండవేళ్ళు వీనిని సమముగాఁజక్కరతోఁ గలిపి పందినేతితో లేహ్యమగునటుల నుడుకఁబెట్టి గొఱ్రెపాలతో 15 దినములు కుడువఁ బెట్టిన నీ జంబుక వాతము హరించును.

37 తీటకు

కం॥ కలియును, బూరుగు బంకయు,
తిలకుసుమము వండిపెట్టఁ దీటలుమానున్
గలియును వెంపలి పసరును,
వలనుగ గల్లుప్పుఁ బెట్ట । వాతము మానున్ ॥ రఓ

తా॥ కడుగు, బూరుగుబంక, నువ్వుపువ్వు, వీనిని నీటితో ఉడికించి పెట్టిన దురదలు హరించును. కలి వెంపలాకుపసరు, కల్లుప్పు వీనిని పెట్టినచో వాతము నశించును.

## 38 తలలోని దీటులకు

సీ॥ పశువులు తలగాడి । పలుమారు గోడదూడ
కొనడొక్క తలకాయ । గోకికొనిన
తలమెరియగు నొండె। తలలోని దీటగా
జనురోగ మని కను । గొనుచునుండు
ఆవాలు, చవిలెత్తు । అమరంగ వెల్లులి
శొంఠినిఁ బొడుముగాఁ । జేసి వేగ
గోలిమిడి పసరును । గూర్చి కర్ణములందు
నశ్యంబుఁ జేసి య । నంతరంబ
గీ॥ కొనచెవుల్ రెండు కొమ్ములుఁ । గూడఁగట్టఁ
బాయురోగముల్ రెండును । వేయునేల
జనులు సహదేవ మతమును । జదివి యెరిగి
చేయుడీ మీరు సురభుల । జీవరక్ష ॥ ౪౭

తా॥ పశువులు తలచుఁ గాలిడెక్కలతోడ, చెట్టు చేమలకుఁ దగిలించుకొని తలగోకి కొనును. అందుచే దలలో నొక తీటయో, నొప్పియో, యున్నదని గ్రహింప దగును. ఇందులకు ఆవాలు, వెల్లుల్లి, శొంఠిచూర్ణముచేసి గొలిమిడాకు పసరుతోఁ గలిపి చెవులలోఁ బోయవలెను.

## 39 అంగిటి ముండ్లకుఁ జికిత్స

కం॥ మేపర దాకిన కుత్తుక
వాపునకుంగార ముండ్లు । వడి నణచుచునా
వాపుకుఁ గంఠముఁ జూపిన
నా పసరసమునకు మాను । నంగిటి ముండ్లుగ ॥ ౪౮

తా॥ మేతఁ దినుటకు వీలులేకఁ గంఠము వాచియున్న పరిస్థితులలోఁ బశువులకు గారముండ్లలోఁగొట్టి కంఠమునకు రక్షబెట్టినయెడల వ్యాధి హరించును.

## 40 ముక్కుబంతికి చికిత్స

కం॥ ముకుబంతి తలము నెక్కిన
నొకశాలము నందుఁబసర । ముదుగక దగ్గుగ

ఒకపిల్లి గడ్డయూ సుర
భికనస్యముఁ జేయఁదగును । వేర్కొనిమానుక్ ॥ ౪౫

తా॥ పసరముయొక్క తలలో ముకుబంతిపుట్టి దగ్గునపుడు పిల్లి గడ్డ నొకదాని నశ్యముగానుపయోగించినఁ జేరుచెప్పి యాదగ్గుపోవును.

41 పగర్పునకు జికిత్స

కం॥ కలియును, వెంపలి రసమును
గలుపుము నశ్యంబుఁజేయు । గాదగ్గుడుగుక్
గలియును మోదుగ పసరును
దిలపిష్టముఁ బెట్టనగరు । తిరుగుక్ బసికిక్ ॥ ౫౦

తా॥ కడుగులో వెంపలిమూపరసము గలిపి నశ్యాంబుచేయుటయు కడుగులో మోదుగాకు రసము, తెలకపిండి కలిపి తినుపించుటయు జరిగిన యెడల దగ్గు, పగర్పు మాయుమగును.

42 గుండెవగర్పునకు, దగ్గునకుఁ చికిత్స

కం॥ ఇలవేము గడ్డరసమును
గలియుగఁ నొకటొకటినూరి । కలితోఁ బెట్టక్
బొలుపుగ దగ్గువగర్పును
వెలయంగాఁ గుముటమాను । వేగమె పసికిక్ ॥ ౫౧

తా॥ నేలవేము దుంపరసము, గడుగుఁ బెట్టినచో దగ్గు వగర్పు హరింపఁగలవు.

43 పురుగు పుట్టిన, పుండ్లు మానుటకు

కం॥ పుచ్చిన పుంటికిఁ బురుగును
జచ్చేటందుకును నుల్లి । సహితము ఘృతముక్
వెచ్చంగఁ గాచిపోయఁగ
వెచ్చములేనట్టి పుండు । వేగమె మానుక్ ॥ ౫౨

తా॥ వెల్లుల్లి నేతితోఁ గాచిపోసినచో పురుగుతోఁ గూడిన పుండ్లు అన్నియు మానును.

44 పుండు తొలగుటకుఁ చికిత్స

కం॥ పసికాలు పుండు తొలఁచిన
నెసఁగన్న కాలుపట్టి । యూడ్చినదానిక్

వెసఁ ద్రికటుకము మ్మెత్తం
బసికిని బూయఁగను బుండు । బాగుగ మానుఁ ॥ ౫౩

తా॥ పసరములకు బొదముల యందుఁ బుండయిన వడువజాలక యీడ్చుచున్న స్థితిలో శొంఠి, మిరియాలు, ఉమ్మెత్తయు గలిపి నూరి పుండుపై పూతబెట్టిన మారంచును.

## 45. ఈచగాలికి చికిత్స

కం॥ కాలెండి యీచపోయిన
పాలనుచే గోణిదియాకు । పసరునుగూడం
గాలికిఁ బూసియుఁ దోమిన
తేలియు నటు కాలుసాగఁ । దిన్నగ వచ్చున్॥ ౫౪

తా॥ ఈచకాలికి, పాలలో నేకోణిదియాకు రసమును కలిపి కాలికిఁ బూతబెట్టి మర్దించిన నయమగును,

కం॥ దానికి నిరువది దినములు
కానిది మఱి చక్కఁగాదు । కావున వెడలం
బోనీక కట్టి మేపిన
కానిది యగు మేలు తొంటి । క్రియమున వచ్చున్॥ ౫౫

తా॥ పైన చెప్పిన ప్రక్రియ వరుసగా నిరువదిరోజులు చేసినగాని కుదురదు. కావున అంతవరకు కదలనీయకుండ కట్టి మేపవలయును.

## 46. కాలు విరిగినందులకు చికిత్స

చ॥ పసరము దా పెరిఁగియును । పన్నుగ బోటును బోవకుండినన్
మసలక వానినిన్ దురచి । మూనెడుపాలు కలంగరాకు ప
ప్పసరున వెన్నయుం గలిపి । పాత్రమున చూర్ణము నేడువారముల్
విసువక కట్టిపెట్టు మరి । విర్గిన కాలును వచ్చు చక్కఁగన్. ౫౬

తా॥ కాలు విరిగి నొప్పిచే బాధపడుచున్న పసరమునకు గుంటగలగరాకు పసరు వెన్నతో కలిపి రాయుచు కట్టుగట్టిన యెడల నది కుదురును.

## 47 పోటు పోవనిచో

గీ॥ పోటుపోయి విరిగి । పొరిగాలుకుంటిన
నెముక చక్కఁద్రోపి । యేడునాళ్ళు

నెనుము నెయ్యిబోలు । నెనరంగపోసిన
నెముకకట్టికాలు । కే్రపువచ్చు ॥ ౫౭

తా॥ పోటు వగయిరా పోయి కు టుట మాత్రము పోవనిచో గేడె నేతితో పాలుకల్పి మర్దన చేయుచు నెముక సర్దవలెను.

48 మావి పోవుటకు

గీ॥ ఈనిమావి నెయ్యి । లేని పశులకెల్ల
ననుపకట్టు పుచ్చ । యాకు రసము
పేలపిండితోడ । బెట్టుటకాదేని
మలుగుచుట్టుమాండ్లు । మరువ వలయు ॥ ౫౮

తా॥ మలుగులమీద పుట్టనున్న పన్నించి, అనుపకట్టు, పుచ్చ యాకు రసము, పేలపిండి వీనిని బెట్టినను మావివేయును.

49 ఇంకొక మాదిరి

కం॥ పులిచల్ల, కందగడ్డయు
నలియంగా నూరియేడు । నాళ్ళటు పోయం
దలకొనిన మలుగులోవల
బలిసినచో మావి బైకి । వచ్చుంబసికిన్ ॥ ౫౯

తా॥ పులిచల్ల, కందగడ్డయు, నూరి వరుసగా నేడుదినములు పెట్టిన మావి పడును.

50 దున్నకట్ట బలహీనమైన పశువులకు

ఉ॥ ప్రక్కల బట్టు కావునను । బాసిన వెంట్రుకం బేడంబెట్టినన్
చెక్కలు వేము, కారుమ్రకము । చిత్రము, జిల్లెడుంగూడ నేలవే
ముక్కసమంబు చల్లయును । నొవ్వంగం గొట్టెండు చేసిమొత్తగన్
ద్రొక్కిన నేడు వారములు । దొడ్డపడన్ బసి మేవు బెంపునన్ ॥

తా॥ వెంట్రుకలు పేడలో బడుచున్న పశువులకు మునగ, వేపు కారు, చిత్రమూలము, జిల్లేడు, నేలవేము, యీ చెక్కలు సమముగా నూరి చల్లతోం గలిపి గొట్టమును పట్టుచుండ వలయును. అట్లుచేసిన 7 దినములలో నీరోగము రూపుమాయును.

కం॥ దున్నక యందున డస్సియు,
నున్నసురభి సల్లంబడిన । నొకతిల పిష్టం

అన్నమునఁ గలిపి పెట్టినఁ
జన్నగ బదిహేను తిథులఁ । జక్కగ జేరున్ ॥ ౬౧

తా॥ దున్నుట యందు డస్సిన పశువుల కన్నమునందుఁ దేలకపిండిఁ గలిపి పెట్టిన 15 దినములలో బడలిక తీరి వఱల దున్నుట కక్కఱకు రాగలవు.

కం॥ మెడవంపునఁ బెనువుండయి
బడుగగుఁ బసరంబుగూడు । బడు చోట్లందగన్
దడిబూడ్దె మెదిపి పూయఁగ
గడువేగమె తేరివ్రుడ్లు । గండ్లును మానున్ ॥ ౬౨

తా॥ పశులకు మెడపైఁ బుండ్లుపుట్టినఁ బుండ్ల ప్రదేశమునందు బాడిమట్టియు, బూడియు గలిపినచో బుండ్లు, గండ్లు మానఁగలవు.

51 పోట్ల దూడలకు

కం॥ దోడఁబడి పోడుచు బసగము
కాలస్యము లేకదాని । యక్షుల రెంటిం
దైవము బెట్టిన నేడు ది
నాలకు శాంతము వహించు । నాబోత్తైనన్ ॥ ౬౩

తా॥ పోట్ల దూడలకు కన్నులయందు నువ్వులనూనె బోసిన వారము దినములలో సాధుగుణ మలవడును.

52 పుప్పిపంటికి

సీ॥ పారిజాతాకును । నీరధి లవణంబు
మిరియంబు తోడిబార । మెదిపి పెట్టి
కాచేని గాడిద । గడపాకు మిరియంబు
గూడ కల్లుప్పును । గూర్చిపెట్టి
సమకూరదయ్యెనా । చనుకొత్త సున్నంబు
ఆముదమును గల్పి । యచటబెట్టి
కరి ధూపము పొగాకు । కలిడిరా సున్నంబు
పొట్లాకు నూగును । పొసగబెట్టి
గీ॥ మఱియు దంబాకు బెట్టిన । మానునపుడు
చెట్టతీసిన వేగంబు । నట్టులేక

ప్రాతకొత్త పుండైనను । ఖ్యాతితోడ
పుప్పిపుండు మానునుగేదె । పురుగుతోడ ॥ ౬౪

తా॥ పుప్పిపంటికి పారిజాతపుఆకు, ఉప్పు, మిరియము గుమ్మడి పాలతో కలిపిగాని లేక గాడిదగడ్డపాదాకు, మిరియము, సైంధవలవణము, కలిపిగాని క్రొత్తసున్నము ఆముదము కలిపిగాని కరిదూపము, ఆనపాకు రాతిసున్నము, పొట్టనూగు, పొగాకు మెదిపిగానిపంటిపై బెట్టినమానును.

౯౩ పొడుగు పుచ్చినందులకు

గీ॥ పితికెయావు పొదుగు । పుచ్చిన త్వరితము
సూర్యరశ్మిపాలు । జూచి చల్లు
ఉత్తరేణియాకు । వెల్లుల్లి మెత్తగా
నూరి జలధి యుప్పు । మేరమీర ॥ ౬౫

తా॥ జిల్లేడుపాలుగాని, యుత్తరేణియాకుగాని వెల్లుల్లి ఉప్పు నూరిగాని రాచేది.

54 పుడ్లు మానుటకు

కం॥ కాకులు పొడవక యుండిన
మాకొని యుండంగనీగ । ముసరక యుండన్
నాకక యుండగ వేగమె
చేకొని యరయరిగ పుండు । శీఘ్రమె మానున్ ॥ ౬౬

తా॥ పుండ్లను గాకులు పొడువకుండా యీగలు ముసరకుండ తనకు దానై నాకికొనకుండా పసరమును గాపాడిన పుండ్లు వేగమే మానగలవు.

౫౫ వగర్పునకు

చ॥ తనువగరయ్యెనేని బసి । తాపమునంబడు నెండలోని నే
పనికిని నిల్వనోప దతి । భారము బాల్పదు పక్కలెత్తుచున్
అనిశము నూదితోటుపడు । నంకిలియూర్పులుచక్కగామియున్
అనుగును వెండ నైజములు । కాదిగుణంబులు మాని యేమయున్॥

తా॥ వగర్పుగల పశువు ఎండతో నిల్వజాలకుండును భారము మోయజాలదు. ఊపిరి తిరుగకుండును తొట్రుపడుచుండును.

## 56 ఇందులకు చికిత్స

కం॥ వసయును, పిప్పలి, శొంఠియు,
వసపును నశ్యంబుజేసి । బదిమిరియములుం
బొసగ నవినూరి పశువుకు
విసువక బెట్టగ వగర్పు । వేగమె మానున్ ॥ ౬౮

తా॥ వస, పిప్పలి, శొంఠి పశువునకు నశ్యముగా జేసి యావస్తువులే పదిమిరియములతో గలిపి నూరి తినిపించిన వగర్పు హరించును.

## 57 వగర్పునకు

కం॥ వినుమడ్డసరము మానెడు
నెనిమిది గండెములు శొంఠి । యేర్పడ మిరియం
బును పసుపు గూర్చి నాలుగు
దినములు పెట్టంగమాను । దెప్పున బసికిన్ ॥ ౬౯

తా॥ వగర్పునకు అడ్డసరపాకురసము మానెడు 8 గండెలు శొంఠి పొడి అంతే మిరియంబులును పసుపును కలిపినూరి 4 దినములు పెట్టిన మానును.

## 58 తేలుకరచిన పశువులకు చికిత్స

కం॥ వృశ్చికపు పోటు దవిలిన
పశ్చాత్తాపమున బొరల । బదిమిరియంబుల్
గచ్చపొడి గన్నులందిడి
నిశ్చయముగ నదియెపెట్ట । నెరివిష హరమౌ ॥ ౭౦

తా॥ పశువులకు తేలుకుట్టిన బదిమిరియములు గచ్చాకు కలిపి నూరి కండ్లలో బెట్టి దానినే లోనికి దినిపించిన తేలుబాధ హరించును.

## 59 మఱియొక చికిత్స

కం॥ వసయును పిప్పలి, శొంఠియు
పసుపును నశ్యంబుజేసి । బదిమిరియంబుల్
బసరముకు తేలు కుట్టిన
విసహారమగు నాతుణంబ । విధిగావినుడీ ॥ ౭౧

తా॥ వస, పిప్పలి, శొంఠి, పదిమిరియాలు, పసుపు, వీనిని నూనెతోనూరి, తేలుకుట్టిన ప్రదేశమున మర్దనం జేసిన హరించును.

60 పాముకాటు లక్షణము

కం॥ ఏపాము కఱచె నేనియు
నాపసరము బడుసుయూర్పు । లారోమంబుల్
యేపున మరుగొండ్రించును
మేపుసు నీళ్ళసుదొలంగి । మేదిని కొరుగున్ ॥ ౭౨

తా॥ పసరమునకుఁ బాము కఱచిన నూరువు ఎక్కువగును: రోమములు నిక్కపొడుచును, మేత నీళ్ళు విసర్జించును. స్మృతిఁదప్పి పడియుండును.

61 ఇందులకు చికిత్స

ఆ॥ నిగుడనాగరసము । నీరును బెట్టిన
నెల్ల పాము విషము । తెల్లమూను
భూతభయము విడ చి । పోవును పసికిని
కాటుకయును బెట్ట । గన్నులకును ॥ ౭౩

తా॥ పాముకఱచిన పసరమునకు నాగముషిణి రసమును లోని కిచ్చి దానితోడనే కంటికి కలికముగా వేసిన బ్రదుకగలదు.

62 మఱియొక చికిత్స

కం॥ పడికీటకంబు మూర్కొన
గడుపుబ్బును శేలవేరు । గంధము కలితో
నలగగ నూరుడు గొట్టెడు
కడుపునకిడి నంతవిషము । గ్రక్కను మీదన్ ॥ ౭౪

తా॥ పురుగు ముట్టుకొనిన సమయంబునందు శేలవేళ్లను బాగుగా నూరి కడుగులో కలిపి త్రాగించిన విషము విరిగి పసరము జీవింప గలదు.

చ॥ ఒడలుభుజంగ దండములు । నొప్పగనాటిన దానిమూన్పగా
పడిగను తేగమూత్రమును । వారధి యువ్వను వెండితెల్ల జి

ల్లెడుకొని గోవుదుగ్ధమున । లెస్సగమర్దన చేసియిన్నియుఁ
గడు రభసంబుతో బసికి । గన్నులబెట్టిన నిర్విషంబగుఁ ॥ ౬౨

తా॥ పాముయొక్క కోఱలు పశువుయొక్క శరీరమునకు నాటు కొనినయెడల లేగదూడల పంచితమును, లవణంబును, తెల్లజిల్లేడు చిగుళ్ళను, ఆవుపాలును, చేర్చి బాగుగా మర్దించి వేగము కన్నులలో నుపయోగించిన విషము హరింపగలదు.

63 పేరు తెలియని తెగుళ్ళకు చికిత్స

కం॥ సీరుల్లి, కోడిరెట్టయు
వారధి లవణంబు వెండి । వసయును జతగా
నారయు దిల తైలముతో
బేరెరుగని రోగమునకు । బెట్టినబాగౌ ॥ ౬౩

తా॥ సీరుల్లి, కోడిరెట్టయు, లవణము వస, వీనిని నూనెతో మర్దనచేసి తినిపించిన పేరు తెలియని యన్నిరోగములు హరింపగలవు.

64 తైలము తలకెక్కవలయు నన్నచో

కం॥ తైలము తలకెక్కినపుడు
గోళ్ళను కనకంపుతీగ । చుట్టుచుముఖముఁ
గాలంగట్టుచు గొమ్ములు
తాటిల్లగ నున్నయిట్టి । తైలము విరచుఁ ॥ ౬౪

తా॥ చమురు తలకెక్కిన పిశువుయొక్క ముక్కునకు బంగారు తీగను గ్రుచ్చి కొమ్ములు కాలికివంచి గట్టిగాఁ గట్టి యుంచిన నూనె దిగ గలదు.

65 చెవులలోఁ గురుపులు లేచినచో

కం॥ చెవియందుఁ బుండుపుట్టిన
గనబలువుకు నిమ్మపులును । గ్రక్కన నిడియా

చెవికింగొమ్మునుఁ గట్టిన
వివరముగాఁ బసికిప్రుఁడు । వేగమె మానుఁ ॥ ౭౮

తా॥ గవ్వను బూడిదజేసి, అందు నిమ్మకాయరసము కలిపి పశువుయొక్క చెవిలోఁ బోయుచు గొమ్ములకు రాచిన హరింపఁగలవు.

66 అన్నివిధములైన రోగములకు

కం॥ ఇలసకల రోగములకును
తొలితొలి సుంకుడును, గొ్రి । తోఁటను భూవే
ములపొడి కలితో నూరియుఁ
గలికము గొట్టెడును బెట్టఁ । గాహరియించుఁ ॥ ౭౯

తా॥ కుంకుడు గొత్త్రితోలు, నేలవేముమసి పొడి కడుగుతో గొట్టముడు పెట్టిన నన్నిరోగములు సమసిపోఁగలవు.

కం॥ దాననొక కొంత శమనము
గానది సహదేవమతముఁ గైకొనిసేయుఁ
ధేనువులు బ్రతుకు నిజమిది
మానుగలావై సమస్త । మనుజులఁ బ్రోచుఁ ॥ ౮౦

తా॥ ఇందువలనఁ గొంత శాంతము గల్గును, సమస్త రోగములు హరింపగలవు. పశువులు బ్రతికి మనుజసంతతిని చక్కగా సంరక్షణసేయ గలవని సహదేవ గ్రంథకర్త హెచ్చరించుచున్నాడు.

67 శరీరము కాలినచో

కం॥ మైయొల్ల కాలుపసికిని
కాయంబున కెల్లగాడ్దె । గడుపపు వసమం
బూయఁగ మానును మఱియుఁ
బూయుఁడు తరిచల్ల పిడక । బూడిదతోడఁ ॥ ౮౧

తా॥ కాలిన పశువులయొక్క శరీరమునకు గాడిదె గడ్డపారాకు పసరును బూయవలయును, పిడక బూడిదను చల్లతోఁ గలిపి రాయవచ్చును.

68 కణుతుల యొక్క లక్షణము

కం॥ ఈనేముందర నిక్కము
గానవియవి వానిమేను । గడునున బడకుఁ
యీనిన వెనుకను డయ్యును
నానాటికి బాలుతరిగి । నాసిలుచుందుఁ ॥ ౮౨

తా॥ ఈనే ముందర పశువుయొక్క దేహమునకుఁ గణతులుపుట్టినను అవిమానకున్నను యీనిన పిమ్మట డస్సిపోయెడి కారణమున క్రమముగాఁ బాలు తరుగుటయే గాక పశువులు నీరసించును.

69 మరణించిన దూడ బయలు పడుటకు

గీ॥ ప్రత్తియాకురసము । బావంచ రసమును
మేడిచెక్క పొడియు । మిరియపుపొడిఁ
బుచ్చరసము నూనె । పోయంగ నుదరంబు
నందుఁజచ్చియున్న । కందువెడలు ॥ ౮3

తా॥ ప్రత్తియాకు రసము బావంచాలరసము మేడిచెక్కపొడి పుచ్చరసము నూనె కలిపి కాచిపెట్టిన మరణించినదూడ బయటకు రాగలదు.

70 నరము తెగిన పశువులకు చికిత్స

చ॥ నరములు ఛేద్యమొందవగల । నల్లని నీలియు దివ్వతీగయుఁ
గురుతరమైన యాతరవు । గుప్పిన మూలము చర్మచూర్ణముఁ
సురభికి వెన్నతోఁగలిపి । సుస్థికిపెట్టిన బుట్టబూసిన
న్నిరువదినాళ్ళ యాతుదకు నేర్పడవచ్చు నరంబులన్నియుఁ॥ ౮౪

తా॥ నరములు తెగినచో నీలిగుంప తిప్పతీగ గుప్పెనవేరు పట్ట, యొక్క చర్మము వీనిని రసమును పుట్టమట్టితో బూసిన సద్దుకొని నరములు బాగగును.

71 కాలుకుంటునకు చికిత్స

గీ॥ కుంటు తెంపులు తగిలి । గోపదేల్బసికిని
కొందిబిజిల్లెడునుమ । కొనలు విరచి,
ముక్కు కొనలలోన । కెక్కించి యుండిన
కుంటితెవులుపోయి । కూర్మి నెసగు ॥ ౭౧

తా॥ జిల్లెడుపువ్వుల చిగుళ్ళు విరచి ముక్కులందు దూర్చిన కుంటుట పోవును.

72 గాలి తగులకుండుటకు

కం॥ తైలంబు కోడగ్రివాన్నము
మాలిమితో నేడుమార్లు । మంత్రించియుగో
జాలంబున కును బెట్టిన
నాలిక గాలంటదందు । రార్యజనంబుల్ ॥ ౭౨

తా॥ గాలితగులకుండుటకు, నూనె, అరికయన్నము వీనిని "శ్లో॥ ఘంటాకర్ణం మహాఘోరం । సర్వవ్యాధి భయంకరం । ఖగరోగ వినాశాయ । రక్షరక్ష మహాబలం" యీ మంత్రమును నేడుమార్లు పఠించుచు బెట్టిన నివారణ మగును.

73 మొత్తకాలునకు చికిత్స

క॥ కరకపొడి, కొత్తసున్నము
మరిపులి ఖండ. బుతోడ । మర్దించియు గో

వరికాలబెట్టి కాచిన
స్థిరముగ నామెత్త కాలు । తేజమునందుక్ ॥ ౭౭

తా॥ కరక్కాయచూర్ణము సున్నము, చింతపులుసుతో నూరి పశువుయొక్క అరికాలికి దగిలించి కాపించినచో హరించును.

## 74 కురుమలక్షణము

కం॥ నాలుగు కాళ్ళను నిలువక
నేలను తొట్రుగిలి మేవు । నీళ్ళను ద్రాలగుక్ .
సోలుంజులకడ లేవగు
కోలుని కడుపుబ్బరించు । కురుమ గుణంబుల్ ॥ ౭౮

తా॥ కురుమ లక్షణము లెవ్వియనగా నిలువక పోవుట నీళ్ళను ద్రావుటను మేత దినుటను మానుట నేలను తొట్రిగిలుట సోలియుండుట కడుపుబ్బి యుండుటయును.

## 75 ఇందులకు జికిత్స

గీ॥ కురుమ గొన్న పసికి । నరయ దుష్టపుతీగె
గాడిదెముకకూర్చి । కట్టునెడల
దలను గదియి పిడక । వెలిమిడిఁ దగఁబూయ
నాలకురుమ తెవులు । నణఁగిపోవు ॥ ౭౯

తా॥ దుష్టపాకు తీగెయొక్కరసము, గాడిదయెముక గంధము వెలిమిడి, కలిపి తలకు రాచినచో నీరోగము మానును.

## 76 ఇంకొక చికిత్స

కం॥ అది చిక్కకుండ నేనియు
నదనునకొక చెప్పుతెట్టు । యాంపడితీగెం

బదిలముగ గ్రుచ్చి కట్టిన
సదమలముగ పిడకభూతి । చల్లినమానుఁ ॥ ౭౦

తా॥ పైని చెప్పిన వస్తువులు సమయమునకుఁ జిక్కకున్న సమయమందు చెప్పుతట్ట ఆకుతీగెను గుచ్చి తలకుఁగట్టి పిడక బూడిదె చల్లవలెను.

77 చండికాలికిఁ జికిత్స

ఆ॥ చండికాలుయొద్దు । సరిముందు కుంటిన
వెనుకఁ గాలిగోరు । వీడిపడఁగ
నెత్తురుబ్బఁగొట్టి । నీరుతోఁ దోమిన
చండికాలుకుంటి । చక్కపడును ॥ ౭౧

తా॥ గోటివద్ద నెత్తురును పైకి చిమ్మునటులచేసి నీటితోఁ గడిగినచోఁ, చండిబట్టిన కాలుకుంటుట మానును.

78 మణువు కాలికి

కం॥ అరయుంగఁ గాలి మణుగుకు
నిరుగడ నైదంగుళములు । నెక్కనచుట్టుఁ
అరయఁగ బూడిదగాదే
వరబిరముగ దక్కదగ్గి । వంకరగట్టుఁ ॥ ౭౨

తా॥ కాలు మడిగినచోఁ జుట్టు నైదంగుళములు రక్షచేసినఁ జక్కపడఁగలదు.

79 సాధారణ రోగములకు

గీ॥ దూలి; నేరేడు, గలిజేరు । మూలము, వస
కొమ్ము మిరియంబు నూరిచి । నెమ్మితోడ

మెత్తగానూరి కన్నుల । మీఁదఁబెట్ట
గాను పశుల తెవులు మాను । క్రిమముతోడ ॥ ౭౩

తా॥ దూలగొండి, నేరేడు, గలిజేరువేళ్ళు, వస, మిరియములు వీనిని మెత్తగా నూరి కలికముగాఁ బెట్టినచో సాధారణ రోగములు హరించును.

## 80 శెల తెవులునకుఁ చికిత్స

కం॥ శెలదెవులుదాకి చిక్కిన
కలితో నీమందునూరి । కన్నులనిడినన్
శెలనిడిచి లేలయాకును
నలయఁగ పొగఁబెట్టమాను । నయముగఁ బసికిన్ ॥ ౭౪

తా॥ పైనచెప్పిన మందైనను సరియె, లేకున్న లేలాకుపొగ బట్టినను శెల తెవులు పోఁగలదు.

## 81 ఈదుపులికిఁ చికిత్స

ఆ॥ ఈదు పులియుదాకి । యిరుగాళ్లు వీపును
రాకయున్నఁబసికి । రావిచెక్క
మఱియుఁ బచ్చిపాల । మరువక నాల్నాళ్ళు
గొట్టెడేసిఁబెట్ట । గొడ్డులేచు ॥ ౭౫

తా॥ ఈదుపులి బట్టినచో దూడలకు కాళ్ళు వీపు సాగజాలవు. ఆసమయమున రావిచెక్కరసము పచ్చిపాలలో కలిపి 4 రోజులు పట్టిన సర్దుకొనును.

## 82 కల్లవావు

ఆ॥ కల్లవావు పసికి । గడువచ్చె నేనియు
జుట్టువాతబెట్టు । మట్టుగాను

కాలుగంజి పాలు । గలియంగబోసియు
బూయవావు మాని । పోవుబసికి ॥ ౯౬

తా॥ కల్లవావు వాచినచోట జుట్టును రక్తబెట్టవలయును, వేడి గంజి పాలుకలిపి పూయవలెను లోనికి వాడవలెను.

## 83 మతిరొక చికిత్స

ఆ॥ వావి లాకు పసరు । వల్మీకమును గల్పి
వయిన బూయవావు । బసికిమాను
బాదజేయబసికి । బాగుగా నప్పుడు
కుదురు కల్లవావు । గోవులకును ॥ ౯౭

తా॥ వావిలాకు పసరు పుట్టమట్టితో గలిపి పూసిన గల్లవావు హరించును.

ఆ॥ తిక్క తెవులుదాక । తిరముగా శృంగముగ
గొనలయందు నుగుణు । గోకజుట్టి
నూనెకడపికాళ్ళ । కావకుండగ గట్టి
దివులుఎత్తగదియు । దీరుదిక్క ॥ ౯౮

తా॥ పశువులకు దిక్కయెత్తిన సమయములందు బశువునకు గం తలగట్టి కొమ్ముల కొనలకు గుడ్డచుట్టి నూనెతో దడిపిన కాగడా వెలిగించిన క్షణములో దిక్క తిరుగును.

## 84 ఇందులకుఁ చికిత్స

సీ॥ ఈగువ్వ తెవులును । వేగముగా మాన్ప
కలబంద మట్టిలఁ । గడకు దెచ్చి
కల్లుప్పు నావాలు । నల్లంబు సమముగాఁ
గూడంగ నన్నియు । గుమ్మిపెట్టి
పులిసిన కడుగులోఁ । బోసియాసందులు
మరుగగా నిచ్చుచు । మూడు తిథులు

పసికిఁబెట్టుచునుండి । బడవాళ్లి వమనట్టి
తోఁకగురుచునుమరి । దునిమివైచి

ఆ॥ వేడినేతిలోని । వెలయంగ గొనితోఁకఁ
బెట్టి విడిచనేని । గొట్టజేసి,
మందుబెట్టనేని । మానును సహదేవ
మతము తోఁకగురుసు । మొదలించు ॥ ౯౯

తా॥ కలబంద, ఉప్పు, ఆవాలు, అల్లము, సమముగాఁబులికడుగు తోనుడికించి పూటకు గొట్టము చొప్పున మూడుదినములు పెట్టుటయే కాక, గురునుబారిన వెంట్రుకల బాగుగ కత్తిరించి చిగురువేడి నీటిలో ముంచి వదలివేయుట యుత్తమము.

85 చూలి నిలచుటకు

ఆ॥ అడవి తుమ్మగింజ । కడుమెత్తఁగానూరి
వెన్నతోడ మెదిపి । కన్నులకును
బన్నుగానుబెట్ట । బదియూరుదినములు
చూలుపడ్డలకును । చూలినిలుచు ॥ ౧౦౦

తా॥ అడవి తుమ్మగింజలను వెన్నతో మెత్తగానూరి 16 దినములు పెట్టిన వడ్డల యొక్క చూలి నిలువఁ గలదు.

86 మరియొకటి

కం॥ విచ్చులవిడి, బసరంబున
కిచ్చుటదా మేపుఁ బెట్టి । యిరుమూరు ఘృతం
బిచ్చుగఁ బెట్టిన నయమయి
వచ్చును బది దినములకు న । వారిత దృష్టుల్ ॥ ౧౦౧

తా॥ కడుపునిండ మేతబెట్టి దినమునకు॥ రెండు పర్యాయములు కన్నులలో నెయిఁ బెట్టుచున్నను 10 దినములలో గన్నులు బాగుపడును.

### 87 అవిరికిఁ జికిత్స

గీ॥ పేరియున్న నెయ్యి । పెంకుల పొడియును
నవిరి పెరిగెనేని । యరటి పసరు
మూపు కంటిలోన । మరువక బెట్టిన
నేను నాళ్ళలోన । మానుఁ బసికి ॥ 103

తా॥ పేరిన నేతితో గుంటపెంకులపొడి గాటుకవలె మర్దనము జేసి పెట్టిన యెడల కొద్దిదినములలో నవిరిరోగము హరింపగలదు.

### 88 నిలువుకండ్లకుఁ జికిత్స

కం॥ నిలువులు బడినను దొమ్మిది
నెలలైనను వచ్చుజమ్మి । నెరయగ మచ్చం
ధులమీద రెండు వాతలు
తెలియంగా బెట్టిరేని । దృష్టులు వచ్చున్ ॥ ౧౦౪

తా॥ నిలువుగుడ్లు పడి తొమ్మిది నెలలు గడచినను తెలివితోడ పశువు యొక్క మూనుసంధులు దెలిసికొని రక్షల బెట్టినచో దృష్టులు వచ్చును.

కం॥ కసుకంటఁ బువ్వుపుట్టిన
మసలక దొండాకు పసరు । మరి మిరియంబుల్
పొసగంగ నూరి కండ్లకు
వెసఁబెట్టినఁ బువ్వు లెల్ల, వేగ హరించున్ ॥ 105

తా॥ పశువుయొక్క కంటియందుఁ బువ్వువేసినచో దొండాకు పసరుతో మిరియమును నూరి కాటుకగా నుపయోగించిన పువ్వులు తగ్గిపోవును.

కం॥ దిరిసెన చెక్క రసంబును
మిరియంబును గలియనూరి । మెదపిన పాటున్

నెరియగ నాలుగు పూటలు
విరసవుచెవిఁ బిడువ ప్రువ్వు । వేగమె మానున్ ॥ ౧౦౬

తా॥ దిరిసెన చెక్క రసముతో మిరియంబును కలిపి నూరి నాలుగు పూటలు పువ్వువున్న కంటికి వేసిన పశువుయొక్క దృష్టి చక్క పడఁ గలదు.

## 89 గువ్వ తెవులు

కం॥ గువ్వ తెవులైనఁ బసికిని
నివ్వడు వాలంబుగు త్తి । వెంట్రుకలుండున్
మవ్వముచెడి కడు బెగడుచుఁ
గ్రొవ్వఱి పెడగుండెలగుచు । గుందుచుఁ దిరుగున్ ॥ ౧౦౭

తా॥ గువ్వతెవులైనచోఁ బశువునకు దోఁక వెంట్రుకలూడి పోవును పశువు చిక్కుగా నుండును. బెదురు చూపులతో నటునిటు తిరుగును. చిక్కిపోవును. నవకము జెడును, నీరవపడును.

## 90 కామెర్లకు చికిత్స

ఉ॥ కన్నులం వాచి తోఁయములు । కారిన యంత మరీచి పిప్పలిన్
నున్నగ నూరిపెట్టుఁడోక । న్యూనము పుట్టదు కామలైననా
కన్నుల గుంటకల రసము । గాటుక బెట్టియు దద్రిసంబుతో
గన్నులపెట్టగా శలను । కామెలుమాను దినాష్టకంబునన్ ॥ ౧౦౮

తా॥ పశువునకు గామెర్లు వచ్చినచో మిరియము పిప్పళ్ళు మెత్తగా నూరి గుంటకలకరాకు పసరుతో గాటుకజేసి యుపయోగించిన ఎనిమిది దినములలో బోఁగలవు.

## 91 నీరుకారు కండ్లకు

కం॥ పులుగుడు మూలము గోకియుఁ
జలమున నాగూడరాచి । చక్షుల నిడినన్

పలుమరు నీరుంగారుట
తలనొప్పియుఁ బసరమునకు । త్వరలో మానున్ ॥ ౧౦౯

తా॥ పులుగుడు వేరు శుభ్రముగాఁగోసి నీటితో నరగఁదీసి గంధము కంటిలోఁ బెట్టిన నీరుకారుట తగ్గును.

## 92 ఇంకొక పద్ధతి

కం॥ అరుదొండాకు, మిరియము
క్షీరంబును బోసినూరి । క్రియతోఁ బసికిన్
నేరుపుతోఁ గన్నులనిడఁ
గోరికబందిదినములకును । గుదురును బసికిన్ ॥ ౧౧౦

తా॥ అరుదొండాకు, మిరియము, పాలతో మర్దనచేసి కంటిలో వైచినను నీరుకారుట కట్టును.

## 93 ఇంకొక పద్ధతి

కం॥ ఆడుకరివేము బెట్టిన
నాకోడెలు లావుగల్గు । నావెయ్యలకున్
జేకాని యీరీతియఁ జేసినఁ
బ్రాకటముగఁ జాలుపాల । పండ్లనె నిలుచున్ ॥ ౧౧౧

తా॥ కరివేపాకు మగపశువులకుఁ దినిపించుచోఁ జక్కఁగా బలియుననియు ఆడ పశువులకుఁ బెట్టిన చూలినిలుచుననియు సకల దేవునిమతము,

## 94 నెలతక్కువ దూడలు,

కం॥ కొలనెల నీనిన పశువుకు
తొరుమిడయును వెదురుటాకు । త్రోవఁగఁ జేవన్
దరినీవ లేనిదానికిఁ
గుదులున్ వెదురాకుమేపఁ । గొబ్బున నీనున్ ॥ ౧౧౨

తా॥ తుమ్మి, వెదురుటాకులు వీనిని దినిపించిన నెలతక్కువగాఁ బ్రసవించి పశువులు పాలు చేపగలవు ఈనలేక శ్రమజెందెడి పశువులకు వెంట్రుకలను వెదురుటాకుతో నూరి తినిపించిన వెంటనే ప్రసవించును.

### 95 నెలతక్కువ దూడలు

కం॥ ఆలేక నొక్కమాసము
గాలిని దగులంగనీకఁ । గప్పుచు దానిన్
పాలుకడు ద్రాగనీయక
పాలించియు వెన్నగుడుప । బ్రతుకు నిజంబౌ ॥ ౧౧౩

తా॥ నెలతక్కువ దూడను గాలి యెంతమాత్రము దగులనీయకుండ నేదైనఁ గప్పుచుఁ బాలను విస్తారముగాఁ ద్రావనీక, వెన్నను మాత్రము గుడుపుచున్న లేగ తప్పక బ్రతుకును.

### 96 పాలు చేపుటకు

గీ॥ కట్టనీక పొడిచి । కడుగేప్రు నొల్లక
ముసలి పితికొనేని । బసికైన
పుల్లతీగె నొడలు । బూసి సాధించిన
పిదుకనిచ్చునట్టి । మొదవులైన ॥ ౧౧౪

తా॥ పాలీయక దూడలను పొడచునట్టి ఆవులకు పుల్లతీగె గంధము శరీరమునకు బూసినచో చక్కగా మచ్చికకు రాగలవు.

### 97 మావితినిన పశువులకు

కం॥ తనమావి వైచి మేసిన
ననుములనుఁ బచ్చిపుచ్చు । యూరు రసంబుఁ
వినుచల్ల గలిపిపెట్టిన
దనమదిలో మార్పుగలిగి । తప్పక చేపుఁ ॥ ౧౧౫

తా॥ పశువు దినచూపి తానుదినివైచినపుడు అనుములువుచ్చావు
రసమును చల్లయు గలిపి పెట్టిన క్రమముగా పాలువచ్చును.

### 98 చేపుటకు

కం॥ వెలదిపులి గంటి నెయ్యిని
పులిఖండయు పాలునాల్గు । పూటలుబెట్టన్
దొలిచూలు వడ్డ యెడలను
గలరోగం బెల్లమాని । గ్రక్కున జేపున్ ॥ ౧౧౬

తా॥ తొలిచూలి ఆవులైనను ఆడపులియొక్క క్రొవ్వును చింత
పండు పులుసున్ను గలిపి నాలుగు పూటలిచ్చిన పాలుచేపును.

### 99 దూడను మఱచిపోయినచో

కం॥ చల్లయును దాడికాయలు
కల్లును జీలకర్రను । గంధియు బోయన్
దొల్లి తనప్రేవుముండగ
నొల్లనిదైనేనిబాయ । కుండును దూడన్ ॥ ౧౧౭

తా॥ చల్ల, తాడికాయులు, ఉప్పు, జీలకర్ర, సుగంధి కలిపిపెట్టి
నచో ఆవును తమ దూడలపై మిగుల ప్రేమబుట్టి మఱువకుండును.

### 100 పాలిచ్చుటకు

కం॥ నెయ్యిని గోధుమ గంజియు
బోయ్యగ సురభులకు నాల్గు । పూటలు దానన్
గయ్యాళి పసరమైనను
పెయ్యకరచి వంగటిలుచు । బిటుగగనిచ్చున్ ॥ ౧౧౮

తా॥ నెయ్యి గోధుమగంజి కలిపిపోసిన గయ్యాళి పశువయ్యును
వశ్యము కాగలదు.

### 101 చేపుటకు

కం॥ అడ్డసరపాకు నులిమిడి
గడ్డయు గల్లుప్పు, జీల । కర్రసుగంధిన్

బిడ్డకు బోయగ చేవును
అడ్డెడు పులిచల్లతోడ । నదిగొనిచేవుర్ ॥ ౧౧౯

తా॥ అడ్డసరపాకు, నులిమిడిదుండ, ఉప్పు జీలకర్ర సుగంధి వీనిని గలిపి నూరిపెట్టిన పాలుచేవును.

## 102 చూలినిలువని పశువులకు

ఆ॥ ఫలముగానిగొడ్డు । పడ్డకు పావర
పండురసము పచ్చి । పాలతోడ
బెట్టునపుడు కలయఁ । బెట్టి మేకలనెయ్యి
బెట్ట నిల్చుచూలు । నెట్టిపసికి ॥ ౧౨౦

తా॥ పావరపండురసము, పచ్చిపాలు, మేకనెయ్యి, వీనిని బాగుగా గలిపి పెట్టినచో జూలునిలుచును.

## 103 దూడమరగని దానికి

ఆ॥ ఈనిన పెయినర్మి । లించుక లేకను
గడువనీకదూడఁ । బాడిచానేని
గోవులకును, కొండ । గోగురసంబును
నోడలఁబూయఁ గ్రేవు । గుడువనిచ్చు ॥ ౧౨౧

తా॥ కొండగోగాకు రసమును నోటికిఁ బూసిన దూడను దగ్గఱకు చేరనీయని బశువు సాధువు కాఁగలదు.

## 104 చేపని పశువులకు

కం॥ కలగొని చేగొండాకును
వెలియాలును జీలకర్ర । నిను కల్లుప్పున్
పులిచల్ల గలిపి పెట్టిన
వెలయుగఁ బసరంబు చేపు । వేడుకతోడన్ ॥ ౧౨౨

తా॥ చేగొండాకును, జీలకర్రను నూరి, ఉప్పు పులిచల్లలోఁ గలిపి పెట్టినఁ బాలుచేవును

. కం॥ ఆయూకు నాత్మీయమగు
తోయంబును పచ్చివసువు। తో మిరియంబుల్
చేయుఁడు ముక్కున నశ్యము
చేయఁగఁ బరరంబుచేవు। శీఘ్రము నిజమా॥ 123

తా॥ చేగొండాకును, మిరియమును, పచ్చివసువు, ఆవుమూత్రముతోఁ గలిపి నశ్యముగ జేసి యిచ్చిన పాలుచేవును.

ఆ॥ కన్నెకొమరతీగ। గడ్డతోఁ దలవిరి
గాకునూరిముద్ద। గారవముగ
నువ్వుపిండి గల్పి। నోడలఁ బూయంగను
గుడుపనీనివసికి। గుణముసోకు॥ 124

తా॥ కన్నెకొమారితీగ దుంపలో విరిగాకునూరి నువ్వుపిండిగలిపి నోటికి, బూసిన పాలగుణము కలిగి పశువు వృద్ధిలోకి వచ్చును.

కం॥ గడియము ప్రొద్దుండగనా
పిడియంబుచ్చును వేగ। పేరమనునప్పుడు
ప్పిడియఁగల రసము క్రేవును
వడల జరిమినాక నేయు। నడఁగొనఁచేవుల్॥ 125

తా॥ గడియప్రొద్దుండగనే ఆవును దూడను నొకటిజేసి దూడను నోటినిండ నుప్పని రసముబెట్టిన యెడల ఆవుచేవును.

కం॥ తొలిజూలు పడ్డనుడువం
జలికేచడి దూడకొఱది। చేపకయున్నన్
నులిమిడి యుసిరిక మినుములు
గలితోడను నూరిపోయ। గ్రక్కున జేవుల్॥ 126

తా॥ తొలిచూలియావు పాలుజేవనిచో నులిమిడి, యుసిరిక, మినుములు గలిపి మెత్తగానూరి కడుగుతో బెట్టిన జేవును.

కం॥ పులిఖండంబావాలును
కలతాళవు గడ్డగోఘ్ను। తము దురదలగోం
డిలవిత్తుల చూర్ణంబులు
గలంపుచుఁ గుంచెడును బెట్ట గావసి చేవుల్॥ 126

తా॥ చింతపండు పులుసు, ఆవాలు, నేలతాడిదుంప, దురదగొండి విత్తులు, వీనిని నూరి ఆవునేతితోఁ గలిపి లోనికిచ్చినను పాలు చేపఁ గలవు.

105 మందుఁ బెట్టెడి విధము.

కం॥ మందును బెట్టెడి వేళలఁ
బొందెడెఁ బడ నొడలజేతఁ । బసనుపుచు నవయం
బుందగ బెట్టినఁ గ్రైకొను
సందడి దోఁచినను గూర్మి । జేపవు పశువుల్ ॥ 127

తా॥ పైనఁ దెల్పిన మందు పశువులకు బెట్టెడి వేళలందు లాలనఁ జేయువలయునుగాని బెదిరించినచో నుపయోగము లేదు.

కం॥ మునుబితికి పితుకవలసియు
గునిసినచో నయముఁజేసి । కొనవలె బసికిన్
అనువుగ దృష్టియు దీసిన
ఘనతరముగఁ బాలుచాలఁ । గలుగగ నిచ్చున్ ॥ 128

తా॥ పితికి పితికినమీఁద కోపము తెప్పింపఁబడిన పశువును నయమున బ్రతిమాలియుఁ గన్నుల దోషముఁ దీసి సైచియుఁ బ్రయత్నించిన పశువు పాలుచక్కఁగా నీయగలదు.

106 దృష్టి దోషమునకు

ఉ॥ నిప్పులమీఁద జొన్నలును । నింబదళంబులు ప్రత్తివిత్తులున్
యుప్పును వైచినన్ మొదవు । లొప్పుగ బాడి నొసంగుసత్యమున్
దప్పకఁజూచి మోహమున । దానిఁ గనుంగొను వారికన్నులున్
నిప్పున వేగ నున్నగతి । నీగిరిబోయును వేగునంతకున్ ॥ 129

తా॥ దృష్టిదోషమునకు జొన్నలు, వేపాకు, ప్రత్తిగింజలు, ఉప్పు దిగదుడిచి నిప్పులలోఁ బోసిన హరించును.

107 వేగమే యీనఁజాలకున్న

ఆ॥ ఈనలేక వసరు । దానికి గురువింద
వేరు కలియఁబోసి । నూరి కడుపు

కడిగివ్రాయఁ జడవు । కాకుండ వేగము
యవుడు కేవ్రునిడు ని । రాయసమున ॥ 130

తా॥ ఈనజాలని పశువునకు గురువింద వేరునూరి కడుపునకు వ్రాసిన ఆలస్యము లేకుండ ఈనగలదు.

### 107 దురదకు

కం॥ వెయ్యేల గజ్జికి వేగమె
పుయ్యుఁడు కామంచి పసరు । పొలుపుగ దానిన్
బుయ్యు నొక దినములోపల
వెయ్యును మఱియెంతటిట । వేగమె మానున్ ॥ 131

తా॥ కామంచి పసరు గజ్జిగల తావున రాచిన యెడల తీట తొలగును.

### 108 గజ్జికి

ఆ॥ తమ్మిగడ్డతోడ । నుమ్మెత్తయాకును
దుష్టపాకురసము । తోడగూడ
బయిన నొడలబూసి । పాయక గడిగిన
దినదినానగజ్జి । తీరి పోవు ॥ 132

తా॥ తామరదుంప, ఉమ్మెత్తాకు దుష్టపాకు నూరి యొడలికి బూసిన గజ్జిపోవును.

ఆ॥ చలిడాకునూరి । కలిమిాది తెప్పలు
నుదధి లవణ సహిత । నొడలబూయ
మూడుదిధులుగడక । మునుకొనిలేగల
దీటపుండుమాని । తెలివినొందు ॥ 133

తా॥ చలిమిడాకు, కలిమిాద తెట్టు సముద్రలవణమునూరి వరుసగా మూడుదినములు రాచిన దురదలు హరింపగలవు.

## 110 దగ్గుకు చికిత్స

గీ॥ దగ్గుయూర్పు నిలుపు । దాకికాల్చి చురుక
రాకయున్న పసికి రావిచెక్క
మంచి నచ్చిపాలు । మరినాల్గు దినములు
గాచిపెట్టు । గోపుబ్రతుకు ॥ 134

తా॥ రావిచెక్క వచ్చిపాలు నాల్గుదినములు పెట్టవలెను.

కం॥ విరటుని పట్టణమందున
వరగగ సహదేవుసోంత్రీ । పాలకుడయితా
సురభులకు జేసె నీక్రియ
నరయుగ నా చంద్రతార । కంబుగ వెలయున్ ॥ 135

చ॥ నరనుత కీర్తిపాలకుడు । నారయమంత్రి తెనుంగుజేసె నీ
సురభుల కిట్టి వైద్యములు । సొంపెసలారగ నెల్లదిక్కులన్
బరగునిలన్ సుధాకరుడు । భానుడు మేరువు సాగరంబులున్
ధరణియు దిగ్గజంబులును । దారకము ల్గలయంత కాలమున్ ॥ 136

చ॥ స్థిరముగనుండు బాయకను । ధీయుతులన్న ప్రసిద్ధి కెక్కను
ర్వర నరయంగ నిట్టి రస । వత్తరశాస్త్రము తత్క్రమంబుగా
నరులెవరైన నాలివిని । నమ్మిక తోడుత చేయ నీక్రియల్
సిరియును పాడిపంటలును । చెన్నుగ నాయువు గల్గి వర్ధిలున్ ॥ 137

సంపూర్ణము.

---

కొండా శంకరయ్యగారి
ప్రిమియర్ ముద్రణాలయమున ముద్రితము, సికిందాబ్రాద్.